

# BIO-DATA OF
# SRI K. CHANDRAIAH, I.A.S., (Retd.),
## EX-MEMBER, A.P. PUBLIC SERVICE COMMISSION, HYDERABAD

Sri K. Chandraiah was born on 06-07-1924 in Pothvaram Village of Ongole District.

He had his early school education in Kellet High School, Madras and High School Education at the Municipal High School, Ongole. He did his B.A. (Hons) Economics from the Andhra University and obtained a Law Degree from the Madras University. Having been promoted to the Indian Administrative Service, he served in different capacities in the State and in particular proved popular as Collector of Guntur, Hyderabad and Prakasam districts where he implemented the development programmes of the State with distinction along with his other duties. His dedication and commitment secured a great deal of good will of the public. He worked in the departments of Education, Panchayat Raj, Industries, and Revenue Department in different capacities. He was Government nominee as a Syndicate Mmeber in various Universities in A.P. He won a name as an able civilian, a Scholar and a popular writer on topics of Cultural History of the country, episodes of Freedom Struggle and on the communal amity and religious harmony in the city of Hyderabad. The valuable articles written by him were published in the dailies - Indian Express, News Time; Deccan Chronicle, Siasat (Urdu daily), Andhra Prabha, Andhra Patrika (Telugu dailies). These articles focussed the need for National Integrity, and Religious and Communal Harmony.

While in service, he was elevated and appointed as a Member of the Andhra Pradesh Public Service Commission by the State Government in recognition of his multi-faced services.

He has done work on Indian Contribution to Islamic Calligraphy. Exemplary work that throws light on the Cultural Synthesis of Hindu-Muslim talent and patronage. He had delivered extension lectures at Aligarh University, Kakatiya University, State Archives, Andhra Pradesh and at other academic centres.

Sri K. Chandraiah headed a Indo-Soviet, Friendship Delegation to the U.S.S.R. in December, 1983 and wrote articles and addressed meetings on his experience of his visit.

HIs book "Four Centuries of Legendary Hyderabad" was released by the Governor of A.P. Sri Krishna Kant (Now Vice President of India) on 7-7-96.

***Other works that have been finalised for publication are :***

1. Indian Contribution to Islamic Calligraphy.
2. Ornamentation in Indian Epigraphy.

He has been working on the Economic Status of the Scheduled Castes and Tribes with emphasis on Agriculture labour, Wages, Land reforms, Reservations, Atrocities and remedial measures to be undertaken by Government of India and the State Governments. The work is also ready for publication.

***Positions held by him :***

1. Member, A.P.Public Service Commission.
2. He was appointed as a Member of one of the working group of 8th Plan.
3. Chairman, New Gandhi All India Forum for Socio-Economic Growth Studies.
4. Chairman of Salarjung Museum Friends Circle.
5. Executive Member of Maulana Abulkalam Azad Oriental Study and Research Centre.
6. Advisor, Jashuva Memorial Education Trust.
7. Patron, Dr. Ambedkar Peoples Educational Society, Hyderabad.

***Articles Published on Various aspects in the Press :***

| | | |
|---|---|---|
| 1. | The Rampa (Agency) Tribal Rebellion | News Time |
| 2. | The Legendry Alluri Seetarama Raju | Indian Express |
| 3. | The Massacre at Jallianwalabagh | News Time 13-4-84 |
| 4. | The Resurrection of Christ | News Time 22-4-84 |
| 5. | Travel - The Heart of Soviet Russia | Deccan Chronicle 5-2-84 |
| 6. | Historical Controversies - who actually built Taj Mahal | Sunday Chronicle 8-4-84 |
| 7. | Two weeks in the land of the Proletariat | Visalandhra 1-4-84 |
| 8. | Does Kohinoor belong to the Telugus | Indian Express |
| 9. | The Nightingale of India | Deccan Chronicle |
| 10. | Communal Amity of Hyderabad | Part I & II<br>Deccan Chronicle,<br>Andhra Prabha |
| 11. | A daughter's call to her city for sanity | News Time |
| 12. | The city links with British Royalty | Indian Express - 1985 |
| 13. | History - How Amritsar become Holy City of Siks | Sunday Deccan Chronicle 15-1-85 |
| 14. | On Bulgarian Humour | News Time |
| 15. | The Holy Quran and its Glorius Calligraphy | Siasat |
| 16. | On the Thugs | Indian Express |
| 17. | Backward Bidar has turned the corner | Siasat |
| 18. | Thus spoke Dr. Ambedkar | Deccan Chronicle |
| 19. | Can we preserve the Kakatiya Fort & Temples | Andhra Patrika |
| 20. | Administration : | |
| | 1. They Mysterious affairs of Files | 5-10-88 |
| | 2. Accountable to who? Indian Police | I. News Time 3-2-88<br>II. News Time 4-2-88 |

# DEDICATION



**SRI PAUL BHUYAN,** I.A.S.,

CHAIRMAN, TOBACCO BOARD

By

**B.CH. VENKATESWARLU**

PUBLISHER

**POOJA PUBLICATIONS**, GUNTUR

# భారతీయ సంస్కృతిలో కుల ప్రభావం

మనరాష్ట్రాన్ని పరిపాలించిన ఆఖరి నిజామును ఒకపరిపాలకుడుగా గాని లేక కవిగా గాని భావితరాల వారు గుర్తుంచుకోకపోవచ్చు. అయితే ఉస్మానియా విశ్వవిద్యాలయం వ్యవస్థాపకుడుగా ఆయన చిరస్మరణీయుడు. అన్ని సంస్థలుగానే ఉస్మానియా విశ్వవిద్యాలయం కూడా ఆటుపోట్లుకు గురైంది. అయినా అప్రతిహతంగా ముందుకు సాగుతుంది. భారతదేశంలోని అత్యున్నత విశ్వవిద్యాలయాల్లో ఒకటిగా ఇప్పటికే గుర్తింపునొందింది. ఇప్పుడు మనం జరుపుకుంటున్న వజ్రోత్సవాలు విశ్వవిద్యాలయం చరిత్రలో ఒక నూతనోధ్యాయాన్ని ప్రారంభిస్తుందనేది నా నమ్మకం. ఈ వజ్రోత్సవాలకు నన్నాహ్వానించిన విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ప్రొ॥జి. రామిరెడ్డిగారికి, సామాజిక శాస్త్ర అధ్యాపకులు డా॥ సి. లక్ష్మన్న గారికి నా ధన్యవాదాలు. నేనొక రచయితను, అలాగే ఆలోచనావేత్తను. అటువంటి నన్ను ఈ విధంగా సత్కరిస్తున్న వారిరువురికి నా ప్రత్యేక ధన్యవాదాలు. నేను ఈ మాటలను ఏవో ఆనవాయితిగానో, ముఖస్తుతికోసమో అనటం లేదు. అవి నాహృదయాంతరళాలలో నుండి వచ్చిన భావనలు.

నా ఉపన్యాసాన్ని ప్రారంభించబోయేముందు నాదొక చిన్న విన్నపం. భావాలు సంఘర్షణకు లోనవ్వాలని, క్రొత్త భావనలు, క్రొత్త ఆలోచనలు, క్రొత్త జీవన విధానం ఆ విధమైన ఘర్షణ ద్వారానే సాధ్యమని నా నమ్మకం. భావాల మధ్య జరిగిన ఇటువంటి ఘర్షణలో మనిషిని మానవ చరిత్రను మార్చివేస్తాయి. అందువల్ల ఇటువంటి భావ ఘర్షణ ద్వారానే మరింత సమున్నతమైన, నీతి బద్ధమైన ప్రపంచం ఆవిర్భవిస్తుందని నాకు పూర్తి విశ్వాసమున్నది. ఇందువల్లనే నేను సంప్రదాయబద్ధంగా మాట్లాడలేను. అందుకు భిన్నంగానే మాట్లాడుతాను. నా నమ్మకాల గురించి, విశ్వాసాల గురించి నేను ఇవ్వబోయే ఉపన్యాసాన్ని మీరు ఓర్మితో ఆలకించాలని నా విన్నపము.

మనం చర్చించబోయే సమస్య వైరుధ్యాలతో కూడుకొని యున్నప్పుడు మన విధానమేమిటో ముందు నిర్వచించుకోవాలి. నా దృష్టిలో సంస్కృతి అంటే ఏమిటి?

కులం అంటే ఏమిటి? సంస్కృతి అనే పదానికి ఎందరో అనేక రకాలుగా నిర్వచించారు. సంస్కృతి అనే పదం పురాతనమైనది అయినా కాలగమనంతోపాటు క్రొత్త అర్థాన్ని, క్రొత్త పునాదిని ఏర్పరచుకుంటున్నది. ప్రారంభంలో సంస్కృతి అంటే భూమిని దున్నటం అని భావించబడేది. అందుకే సంస్కృతి, నాగరికతలకు సంబంధించిన ప్రముఖ చరిత్రకారుడు విల్‌డ్యురాన్ ఇలా అన్నారు : "సంస్కృతి యొక్క ప్రారంభ దశ వ్యవసాయం" భూమిని దున్నటం నుంచి శాస్త్రాన్ని అధ్యయనం చేయటం దాకా మనిషి పురోగమించాడు. దానితో సంస్కృతియొక్క భావం కూడా మారిపోయింది. సంస్కృతి అంటే శాస్త్ర బద్ధంగా నిరూపించబడిన బాక్టీరియా మొదలైన వాటియొక్క పంట అని భావించబడింది. ఈ రెంటికి మధ్యలో చేపలను , తేనెటీగలను మొ॥గు వాటిని మచ్చిక చేసుకోవడం, పెంచడం, అటువంటి స్వయంసిద్ధమైన పదార్థాలను ఉత్పత్తి చేయడం కూడా పెరిగింది. ఇదేసందర్భంలో ఆధ్మాత్మికం కన్నా భౌతికవాదంపై నమ్మకమున్న కొందరు సంస్కృతి అంటే మానవ శరీరానికి తర్ఫీదుయివ్వటం అని భావించడం జరిగింది. అందుకు వారు గర్వపడేవారు కూడా. ఆక్స్‌ఫర్డ్ ఆంగ్ల నిఘంటువు ప్రకారం "సంస్కృతి అంటే మానవ మేధస్సును పరిశీలించడం" అనే భావాన్ని 1510లో మొట్ట మొదటిగా ప్రవేశపెట్టింది. సర్ థామస్ మోర్ (1478-1535). అప్పటినుంచి సంస్కృతి అంటే మానవ మేధస్సును గురించి ఆలోచించటం, సంస్కారం మొదలైనవిగా భావించబడుతూ వస్తుంది. అలాగే విద్యను, తర్ఫీదును పునర్ నిర్వచించకుండా సంస్కృతిగానే పరిగణించబడుతుంది. ఈ నిర్వచనం కొంతవరకు సమంజస మనిపిస్తుంది. అయితే ఇది పరిపూర్ణం కాదు. అందుకే ఆ పదాన్ని మరింత వివరణాత్మకంగా, శాస్త్రబద్ధంగా నిర్వచించాలని ఇప్పటికి అనేకమంది రచయితలు ప్రయత్నిస్తూనే వున్నారు. కాని ఇంతవరకు ఆ ప్రయత్నంలో సఫలీకృతులు కాలేకపోయారు. ఇందులో ఆశ్యర్యం ఏమీ లేదు. ఎందుకంటే సంస్కృతి యొక్క పరిధి చాలా విస్తృతిమైనది.

సంస్కృతి గురించి ప్రప్రథమంగా ఉపన్యసించిన వ్యక్తి ఇంగ్లాండుకు చెందిన మాథ్యూ ఆర్నాల్డ్ (1822-1888) ప్రముఖ రగ్బీ స్కూలు ప్రధానోపాధ్యాయుడు థామస్ ఆర్నాల్డ్ పెద్ద కుమారుడు మాథ్యూ ఆర్నాల్డ్. ఇంతేగాక అధునాతనమైన పబ్లిక్ పాఠశాలల విధానానికి రూపకర్త కూడా ఆయనే; అందుకే ఆయన సంస్కృతియొక్క

ప్రవక్తగా, ఆయన శిష్యులు అభివర్ణిస్తుంటారు. ఆయన వ్రాసిన "సంస్కృతి మరియు అరాచకత్వం" అనే పుస్తకం యిప్పటికి ప్రచురించబడి శతాబ్ద కాలంపైనే అయింది. ఇప్పటికి ఆ పుస్తకం ఇంకా పునర్ముద్రణ జరుగుతూనే యుంది. డేవర్ విల్సన్ మాటల్లో "ఆ పుస్తక మొక మహద్భుతమైన గద్యకావ్యం. గొప్ప కవి యొక్క పద్యకావ్యం. ఒక బ్రహ్మాండమైన మత సంబంధమైన పుస్తకం. ఇంగ్లీషులో విద్యావిధానం గురించిన అద్భుత పుస్తకం" ఇదంతా వాస్తవమైన సంస్కృతి అంటే మధురమైనదని ఆర్నాల్డ్ యొక్క నిర్వచనం మాత్రం అస్పష్టంగానే వుందనే విషయాన్ని విల్సన్ గూడా అంగీకరించక తప్పలేదు.

మతాన్ని సంస్కృతి ఒకటిగా చూచేందుకు ఆర్నాల్డ్ అంగీకరించలేదు. "సంస్కృతి అనేది మతంకన్నా విస్తృతమైనది. మతం అనేది కేవలం మన విశ్వాసమే' ' అని ఆయన భావించాడు. అయితే నీతి సూత్రాలు, తత్వ శాస్త్రానికి చెందిన ప్రముఖ రచయిత హెన్రీ సెడ్జివిక్ (1838-1900) ఆర్నాల్డ్‌ని విమర్శించాడు. మనకు మాధుర్యము, వెలుగు మాత్రమే సరిపోదు. మరెంతో శక్తి, ధృఢత్వం కావాలి. దీనిని ఒక్క మతమే సమకూర్చిపెడుతుంది అని ఆయన ఒకానొక వ్యాసంలో పేర్కొన్నాడు. సాహిత్యంలో నోబుల్ గ్రహీత టి.యస్. ఇలియట్ (1888-1965) కూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. మతానికి అతీతంగా ఏ సంస్కృతి అభివృద్ధి చెందలేదు. పరిశీలనాత్మక దృష్టితో చూస్తే "మతం నుండి సంస్కృతి ఉద్భవించి ఉండాలి, లేదా సంస్కృతి నుండి మతం ఉద్భవించి ఉండాలి" అని ఇలియట్ అంటారు. అయితే యిది మొత్తం వాస్తం కాకపోవచ్చు. ఇలియట్ దృష్ట్యా చూస్తే మార్క్సిజం కూడా సనాతన మతమే అయిఉండాలి. కానీ రష్యా, చైనా వంటి కమ్యూనిస్టు దేశాలు మతాన్ని తిరస్కరిస్తూనే తమ సంస్కృతి అభివృద్ధి చేసుకున్నాయి కదా! ఇలియట్ ఒకానొక సందర్భంలో "సంస్కృతి అనేది ఒక విధమైన జీవన విధానం" అని అన్నారు. ఇది వాస్తవానికి అతి దగ్గర. మొత్తం మీద చూస్తే రాజకీయాలకు సంబంధించి రాచరికవాది, సాహిత్యానికి సంబంధించి క్లాసికల్ కవి, రచయిత, యితనికి సంబంధించి ఆంగ్లో కాథలిక్ అయిన ఇలియట్ మతవాద పక్షపాతి. ప్రత్యేకించి క్రిష్టియన్ పక్షపాతి.

అమెరికన్ జాతీయుడైన ఇలియట్ ఇంగ్లాండ్‌లో స్థిరపడ్డాడు. అందుకు

భిన్నంగా జాన్ కాపర్ పావే (1872-1963) ఇంగ్లాండ్ జాతీయుడైనా అమెరికాలో స్థిరపడ్డారు. 'సంస్కృతికి అర్ధం' అనే తన పుస్తకాన్ని పావే ఇలా ప్రారంభించాడు. "సంస్కృతి అనే దానికి ఒక పరిపూర్ణ నిర్వచనాన్ని ఇవ్వటం కష్టం. సంస్కృతి అనే దానికి అనేక నిర్వచనాలనిస్తూ ఒక చోట "సంస్కృతి అనేది మతానికి ప్రత్యామ్నాయం; ఆధునిక సమాజంలో మనిషికి విశ్వాసాలపై నమ్మకంలేక పోవటంతో మతంతో సంబంధం తెలిపోతుంది" అన్నాడు. మరొకచోట 'సంస్కృతి అనేది కవితాత్మకమైన మానవత్వం అన్నాడు. మరొకచోట 'సంస్కృతి అంటే జీవన విధానమే' అని వ్యాఖ్యానించాడు.

ఇక శాస్త్రవేత్తలు, సామాజిక వేత్తలు, మనస్తత్వవాదులు, చరిత్రకారులు మొదలైన వారు తమ, తమ భావ దృక్పధం నుండి సంస్కృతిని నిర్వచించారు. మార్క్సిస్టులకు తమ స్వంత నిర్వచనం ఉన్నది. వారి దృష్టిలో మార్క్సిస్టులు కాని తాత్వికులంతా బూర్జువా సంస్కృతియొక్క ప్రతిరూపాలే. ఇన్ని రకాల నిర్వచనాలతో విసుగెత్తిన నాజీ తత్వవేత్త హెర్మన్ జారింగ్ "సంస్కృతి గురించి ఎవరైనా మాట్లాడుతుంటే నా చేతులు తుపాకీ మీదకు వెళతాయి" అని విసుకున్నారు. నాజీలెవరికీ మేధావులంటే గిట్టదు. నా దృష్టిలో మేధావులంటే గిట్టనివారంతా సంస్కృతికి శత్రువులే. సంస్కృతిని గురించిన నిర్వచనాలనన్నింటిని పరిశీలించిన తర్వాత సంస్కృతిని గురించి కొలంబియాకు చెందిన రచయిత, విద్యావేత్త, రాజకీయ వేత్త అయిన జర్మన్ ఆర్బినిగాస్ యొక్క అభిప్రాయము సరైనదని నేను విశ్వసిస్తున్నాను. సంస్కృతి అనే పదానికి ఇంగ్లీషులో 'సేద్యము చేయుటం అనేది' మూల పదం అని భావించిన ఆర్బినిగాస్ "సంస్కృతి అంటే మనిషిని సేద్యము చేయుటయే" అని వ్యాఖ్యానించాడు. ఆర్బినిగాస్‌కు 'భగవంతునిలో విశ్వాసం ఉందో లేదో నాకు తెలియదు' అయితే ఖచ్చితంగా మనిషిమీద అతనికి విశ్వాసమున్నది. అందుకే సంస్కృతిని నిర్వచించటంలో మనిషికి ఆయన కేంద్రస్థానాన్ని కల్పించాడు. ఇది సరైనదని నా నమ్మిక. మనిషిని గురించిన పరిపూర్ణ భావనే సంస్కృతి యొక్క ధ్యేయం మనిషిని మరింత ఉన్నత మానవునిగా చేయటం, అతని యొక్క జీవితస్థాయిని పెంపొందించుట. మానవునిలో ఇప్పటికీ ఉన్న మృగప్రాయమైన లక్షణాలనుంచి అతనిని విముక్తి చేసి, హేతుబద్ధమైన వ్యక్తిగా రూపొందించుటయే సంస్కృతి. ప్రేమని, మానవత్వాన్ని, మానవునికి నేర్పించి

అతను ఆకాశమంత ఎత్తు ఎదిగేందుకు సంస్కృతి దోహదం చేస్తుంది. ఆ విధంగా ఉన్నత విలువలను పెంపొందించుకోవటం శాస్త్ర కళా రంగాలలో క్రొత్త పుంతలు త్రొక్కటం, తద్వారా తన జీవితాన్ని పరిపూర్ణం చేసుకోవటం, మరింత అద్వాన్నం చేసుకోవటం, మరింత సుఖప్రదం చేసుకోవటం జరుగుతుంది. ఈ కోణం నుండి పరిశీలిస్తే సంస్కృతి అనేది ఒక నామ వాచకము కాదని, క్రియాత్మకమని అర్థమవుతుంది. ఒక రకంగా ముందడుగు వేసే క్రమంలో, ఉన్నతస్థాయికి ఎదిగే క్రమంలో, తమ తమ వ్యక్తిత్వాలను మలచుకొనే క్రమంలో చేసే క్రియాత్మక చర్యల సమ్మిళితమే సంస్కృతి. తాము గీచుకున్న సంకుచిత సరిహద్దులను చెరిపి వేసుకొనకపోతే ముందడుగు వేయటం ఎవరికి సాధ్యంకాదు. ఉన్నతాశయాలు లేకపోతే ముందడుగు వేయాలనే భావనరాదు. అదేవిధంగా స్వేచ్ఛగా, ధైర్యంగా చొరవ తీసుకొననట్లయితే తమ వ్యక్తిత్వాలను పరిపుష్టం చేసుకొనలేరు. మరో విధంగా చెప్పాలంటే సంకుచిత భావాలుగల పిరికి మనుషుల సంస్కృతి కూడా ఎప్పుడు సంకుచితముగాను, పిరికిగానూ ఉంటుంది. మన కుల వ్యవస్థ నేపథ్యంలో మన సంస్కృతిని గురించి నేను మాట్లాడబోతున్నాను. కనుక కులతత్వము నిండిన దేశపు సంస్కృతి కూడా తన పునాదులను కులతత్వంలోనే కలిగి వుంటుంది.

ఇప్పుడు నేను 'కులం' అనే దానిని నిర్వచించేందుకు ప్రయత్నిస్తాను. కులమనేది భారతీయ పదము కాదు. అలాగని ఆంగ్లపదము కాదు. అది పోర్చుగీస్ వారిది. కాస్టస్ అనే పదము నుండి కాస్ట్ (Cast) అనే పదము ఉద్భవించింది. కాస్టస్ అంటే కల్తీలేని జాతి అని అర్థము ఈపదము పదహారో శతాబ్దమునుండి ప్రాచుర్యం పొందింది. పదిహేనువందల అర్వై ఏడులో (1567) గోవాలోని పరిశుద్ధ సంస్థ అనే ఒక సంఘం ఒక డిక్రీ జారీచేసింది. గోవాలోని కొన్ని ప్రాంతాల్లో హిందువులను ఆ డిక్రీ ఉన్నతులు, కులీనులు అనే ప్రాతిపదికపై విభిన్న కాస్టస్‌లుగా వర్గీకరించింది. ఆ డిగ్రీ ప్రకారం ఉన్నత వర్గానికి చెందిన వారెవరూ కులీనులతో కలసి త్రాగటంకాని, భోజనము గాని చేయరాదు. ఈ విషయాలన్నీ (ఎల్.ఎస్. ఎస్. ఓ. మల్లే' వెలుగులోకి తెచ్చారు. ఎవరూ కూడా తన తండ్రి యొక్క వ్యాపారాన్ని వదలిపెట్టకూడదని అదే విధంగా చెప్పులు కుట్టే కాస్టస్‌కు చెందిన వారంతా ఒకే వర్గానికి చెందుతారని 'గార్సియా డో ఓర్టా' అనే రచయిత 1563లో వ్రాశాడు. ఆ రకంగా చూస్తే 'కాస్ట్' ఆంగ్ల

పదము సంస్కృతములోని 'వర్ణ' అనే పదానికి దగ్గరగా ఉంటుంది. 'వర్ణ' అంటే రంగు అని అర్ధము భారత దేశముపై దండెత్తి వచ్చి ఈ ఉపఖండంలో స్థిరపడినవారిలో కెల్ల ఆర్యులే మంచి శరీరచ్ఛాయ కల్గిన వారు. తమ శరీరఛాయ చూసి వారెంతో గర్వపడేవారు. మిగిలిన వారిని వారు నల్లవారని పిలిచి అనాగరికులుగా ముద్రవేశారు. ఆర్యులయొక్క ఆది గ్రంథమైన రుగ్వేదంలో నల్లని శరీరచ్ఛాయ కల్గిన ఆర్యేతరుల ప్రస్తావన చాలా చోట్ల ఉన్నది. ఈ శరీర ఛ్ఛాయ ఆధారంగానే సంఘంలో అతని స్థానము నిర్ధారింపబడినది. కులము యొక్క ఆవిర్భావము గురించి అనేకమందికి అనేక అభిప్రాయాలు ఉన్నాయన్న విషయం నాకు తెలుసు. అయితే హిందువులకు చెందిన అనేక పవిత్ర గ్రంధాలలోనూ కులమనే దానిని వర్ణముతో కలుపబడినదని నా విశ్వాసము. భారతదేశంలో స్థిరపడిన తరువాత బహు సంఖ్యాకులయిన నల్లవారి సరసన ఆర్యులు స్థిర నివాసం ఏర్పరుచుకొన్న తరువాతనే కులము ఆవిర్భవించింది. అయితే మూడు అగ్రకులాలకు సంబంధించి రంగు అనేది ప్రామాణికం కాకపోయినా మిగిలిన వారికి సంబంధించి ఛాయే ప్రామాణికమయినది.

ఇలా చెప్పుకుంటే పోతే కులాన్ని నిర్వచించే ప్రయత్నం నుండి నేను ప్రక్కకు తొలగినట్లే అనిపిస్తుంది. అయితే ఇది అసంబద్ధమైనదేమీ కాదు. విశాల దృక్పదం నుండి ఆలోచిస్తే కులమనేది ఒక వర్గమేనని నిర్వచించుకోవచ్చు. అయితే ఇక్కడ వర్గమనేది సాధారణముగా అనుకొనే వర్గములాంటిది కాదు. దేశంలో వర్గ పరిధి బాగా కుంచించుకుపోయింది. సామాజిక చైతన్యాన్ని నిరోధించినది. ఒక వ్యక్తి హిందువుగా జన్మించినట్లే ఒక వ్యక్తి బ్రాహ్మణుడుగానో, క్షత్రియుడుగానో, వైద్యుడుగానో, శూద్రుడుగానో లేక అంటరానివాడుగా జన్మిస్తాడు. అనేక సనాతన గ్రంధాలలో ఒక వ్యక్తి కులాన్ని వ్రాసి ఉన్న సంగతి నాకు తెలుసు. ఇది నిజానికి పెద్ద మోసం. కుల వ్యవస్థయొక్క ప్రారంభదశలో పునర్జన్మ, కర్మ సిద్ధాంతాలతో కుల వ్యవస్థ ముడివేయబడింది. ఈ సిద్ధాంతం ప్రకారం గత జన్మలో నీవు ఏమి చేశావు లేక ఏమి చేయలేదు అనే దానిని బట్టి ఈ జన్మలో నీవు ఏ కులంలో జన్మించాలో నిర్ధారింపబడుతుంది. అంటే కులం పూర్వజన్మ సుకృతం. నీవు మరింత ఉన్నత కులంలో జన్మించాలంటే; ఈ జన్మలో నీ కర్మఫలాన్ని బట్టి వచ్చే జన్మలో సాధ్యపడుతుంది. నీవు కుల వ్యవస్థపై తిరుగబడితే వచ్చే జన్మలో నీవు అతి నికృష్టమైన

చండాలుడిగా జన్మించవచ్చు. లేక అంతకన్నా అతి దారుణమైన ఒక జంతువు గానో లేక కీటకంగానో జన్మించవచ్చు. ఒక్కోసారి మరోసారి జన్మించే అవకాశమే లేకుండా శాశ్వతంగా నరకములో నరకయాతన అనుభవించవచ్చు అని ఆ పుస్తకంలో వ్రాసి వుంది. ఈ దృక్పదం నుండి కులాన్ని నిర్వచించాలంటే కులమనేది గది నాలుగు గోడల మధ్య బిగించబడిన కరుడు గట్టినదని చెప్పాల్సివుంటుంది. ప్రాచీన ప్రపంచంలో బాబిలోనియా, ఈజిప్టు, గ్రీకు, రోము మొదలైన దేశలలోగల కట్టు బానిసత్వమే మెరుగనిపిస్తుంది.

ఇదంతా వింటుంటే కులాన్ని చాలా పరుషంగా విమర్శించానని అనుకోవచ్చు; కాని నావిమర్శ చాలా సౌమ్యమైంది. ఎందుకంటే ఎంతోమంది మహానుభావులు కులాన్ని నాకంటే ఘాటుగా విమర్శించారు. సర్ హెన్రీ మెయిన్ (1822-1888) అనే ప్రముఖ న్యాయశాస్త్ర కోవిదుడు మానవ సంఘంలో అత్యంత విధ్వంసకరమైనది "కులమని" విమర్శించాడు. రవీంద్రనాధ్ ఠాగూర్ (1861-1963) కులాన్ని చూచి "గ్రాండ్ ఇన్క్విజిషన్ కూడా సిగ్గుతో తలవంచుకుంటుంది" అని వ్యాఖ్యానించారు. ఆయన మాటల్లో చెప్పాలంటే కులమనేది ఒక సామాజిక విభజన రేఖ మాత్రమే కాదు; ఒక బృహత్తరమైన జీవన విధానం. కూడు, గుడ్డ, విద్య - వివాహం, దేవారాధన మొదలగునవన్నీ అందులో ఇమిడి వుంటాయి. కులమనేది నిజానికి ఒక సామాజిక విధానం మాత్రమే కాదు? అదే ఒక మతం; కుల కట్టుబాట్లను ఆచరించకపోతే అత్యంత దుర్మార్గమైన శిక్ష ఉంటుంది. అది చూచి గ్రాండ్ ఇన్క్విజిషన్ కూడా సిగ్గుతో తలవంచుకుంటుంది. కులాన్ని గురించి, సంస్కృతి గురించి నా నిర్వచనాలతో మీరూ ఏకీభవిస్తే మన సంస్కృతిలో కులమనేది అత్యంతబలోపేదమైనదని అంగీకరించక తప్పదు. కుల వ్యవస్థ లేని దేశాలలో కూడా అందరికి చెందిన ఒకే సంస్కృతి లేదు అనే విషయం వాస్తవం. అక్కడ కులం బదులు వర్గం ఉంటుంది. అక్కడ జాతీయ సంస్కృతి అంటే వర్గ సంస్కృతి అని అర్థం. ఎఫ్ ఆర్. కోవెల్ ఇలా అన్నారు. "సంస్కృతి అనే దానికి సరైన సమాధానం రావాలంటే ఎవరి సంస్కృతిని ముందు మనం ప్రశ్నించుకోవాలి. అయితే కుల సంస్కృతి అనగా వర్గ సంస్కృతి చిన్నాభిన్నం కాలేదు. స్వభావరీత్యా వర్గాలనేవి కొద్ది మాత్రమే. కాని కులాల సంఖ్య వేలల్లో ఉంటుంది." ఇరావతి కార్వే ప్రకారం మనదేశంలో 2000కు పైగా కులాలున్నాయి. ఉపకారాలన్ని

వాటికి జోడిస్తే మరికొన్ని వేలు పెరుగుతాయి. ఒక్క బ్రాహ్మణులలోనే 2000కు పైగా ఉప కులాలున్నాయి. అందులో కొన్ని ఉపకులాలకు చెందిన బ్రాహ్మణులు అంటరానివారు, అమీబాలుగా తనకుతానే విడగొట్టుకుంటూ పోయే స్వభావం కులాలకుంది. 'తాయా జింకన్' ది గార్డియన్ పత్రికా విలేఖరిగా భారతదేశంలో చాలా సంవత్సరములు గడిపాడు. ఆ సందర్భంలో కులాల గురించి ప్రత్యేకంగా అధ్యయనం చేశాడు. 1911 నుండి 1921 మధ్యగల 10 సంవత్సరాల కాలములో ఒక్క కేరళలలోనే 195 కులాలు క్రొత్తగా ఆవిర్భవించాయి. వీటిలో కొన్ని క్రొత్త కులాలు ఎటువంటి దారుణ పరిస్థితులలో ఉద్భవించాయో తెలుసుకుంటే విషాదకరంగా ఉంటుంది. కరువుల రాష్ట్రమయిన బీహారులో తమ స్వంత కులము వారిచే వెళ్లగొట్టబడిన వారు 'కల్లా' అన్న పేరుతో కొత్త కులంగా ఏర్పడ్డారు. (కాల్ అంటే కరువు అని అర్థం). అదే విధంగా ఒరిస్సాలోని సహాయ శిబిరాల్లోంచి ఆహారాన్ని ఉచితంగ పొందే కొందరు తమకు తాముగా ఒక కులంగా ఏర్పడ్డారు. ఆ కులం పేరు ఛత్రకాయ్ (ఛత్ అంటే ఉచితంగా అన్నం లభించే స్థలం అని అర్థం) ఈ విధంగా క్రొత్త కులాలు ఏర్పడటానికి కేవలం కరువు కాటకాలే కారణం కాదు. మరెన్నో కారణాలున్నాయి. ఉదాహరణకు మంగలివారు తాము ఉపయోగించుకొనే పరికరాలను గుడ్డ సంచుల్లో తీసుకు వెళ్తుండేవారు అనుకుందాం. వారిలో కొందరు అందంగా ఉండే తోలు సంచుల్లో తీసుకెళ్తుండేవారు అనుకుందాం. వారిలో కొందరు అందంగా ఉండే తోలు సంచుల్లో తీసుకెళ్తుంటే మంగలివారిలోనే ఒక క్రొత్త కులంగా ఆవిర్భవించే వారు. ఇటువంటిది కొద్ది కాలం క్రితం ఒరిస్సాలో జరిగింది కూడా. ఆటోమొబైల్ వాహనం నడిపే డ్రైవర్లు కూడా అనేక కులాలుగా ఆవిర్భవించినా నేను ఆశ్చర్యపోను. ఉదాహరణకు కారు డ్రైవర్లు, బస్సు డ్రైవర్లు, ట్రక్కు డ్రైవర్లు, త్రిచక్ర వాహన డ్రైవర్లు, ఆటో రిక్షా డ్రైవర్లు, వర్తమాన రాజకీయ రంగాలలోని అనారోగ్య పరిస్థితులు మూలంగా శాసన సభ్యులు, మంత్రులు వంటి కుహనా క్షత్రియులు ఒక క్రొత్త కులంగా ఏర్పడినా నేను ఆశ్చర్యపోను.

కులాలు ఏర్పడటం అవి మళ్ళీ ఉప కులాలుగా విభజన కావటం కొన్ని వందల సంవత్సరాల క్రితం ప్రారంభమైనది. కేవలం ఐదే కులాలు ఉన్న దశ అసలు ఉన్నదా అని మనకు ఆశ్చర్యం వేస్తుంది. వాటిలో 4 కులాలు హిందూ మతానికి చెందిన వైతే ఐదో కులం హిందూ మతేతరులకు చెందినది. నిజానికి మనుస్మృతి వ్రాయబడేనాటికి

ఎన్నో కులాలున్నాయి. అప్పటికే అగ్రకులాల వారికి, నిమ్న కులాలవారికి వివాహాలు జరుగుటంతో అనులోమా, ప్రతిలోమా తరహా వివాహాలతోపాటుగా కొత్త జనాబా వచ్చి చేరటంలో కులాల సంఖ్య గణనీయంగా పెరిగింది. కాయస్థ అను కులము ఇటువంటిదే. ఈ కాయస్థుల గురించి అశోక శాసనాలలోగాని, కౌటిల్యుడి అర్ధ శాస్త్రంలోగాని ఎటువంటి ప్రస్తావన లేదు. కీ.శ. 3వ శతాబ్దములో వ్రాయబడిన యాజ్ఞవల్క్య సంహితలో ఆ కులం గురించి మొట్టమొదటిసారిగా ప్రస్తావించటం జరిగిందని, ఎన్.కె. దత్ అభిప్రాయపడ్డారు. అది కూడా కేవలం ఒకే ఒక్కసారి ఉదహరించబడింది. క్రీ.శ. 5వ శతాబ్దంలో అమరుడు వ్రాసిన ప్రఖ్యా గ్రంథంలో కూడా ఈ కులం గురించి ప్రాస్తావన లేదు. గుప్తుల కాలంనుండి కాయస్థుల ప్రభావం పెరిగింది. పరిపాలనా యంత్రాంగంలో ఆ కులస్థులు ఎక్కువ మంది ఉండేవారు. (రెవిన్యూ కలెక్టర్లుగా, ఎకౌంటెంట్లుగా, అధికార పత్రముల రిజిస్ట్రార్లుగా) వారు ప్రత్యేకించి పాలనా యంత్రాంగం యెడల చొరవ చూపడంతో ఒక ప్రత్యేకమైన కులీన వర్గంగా ఆవిర్భవించింది. వారి స్వస్థలం బహుశా పర్షియా అయి ఉండవచ్చు. మౌర్యుల పరిపాలన అంతయమిన తరువాత కాలంలో పశ్చిమ మరియు సెంట్రల్ ఆసియా నుండి వారు దండెత్తి వారు బహుశా భారతదేశంలోకి వచ్చి ఉండవచ్చు.

కులాల సంఖ్య పెరగటమంటే అదే స్థాయిలో మన జాతీయ సంస్కృతి చిన్నా భిన్నం ావటమే. ఈ విషయమై మీకు మరొక అభిప్రాయం ఉండదనే నా అభిప్రాయం. మనకు ఒక జాతీయ మైన సంస్కృతి అనేది లేదనే నా అభిప్రాయంతో మీరు అంగీకరించకపోవచ్చు. అప్పటికే మన జాతీయ సంస్కృతి సమైక్యంగా లేదు సరికదా మరింత విధ్వంసానికి లోనయింది. మధ్య ఆసియా నుండి వచ్చిన కాయస్థుల లాగానే యవనుల, శాకాలు, కుషానులు, హుణులు, గుర్జారాలు మొదలయిన వారు కూడా క్షత్రియులుగా అంగీకరించ బడ్డారు. ఇరాన్ నుండి వలస వచ్చిన మాగాలను కూడా మనం మనలో కలుపుకున్నాం. సూర్యారాధకులుగా మిగిలిపోయారు. అంటే కులవ్యవస్థను ఎవరయితే అంగీకరించారో వారియొక్క సంఖ్యా బలాన్ని బట్టి కుల వ్యవస్థలో ఉన్నత కులంగానో, నిమ్న కులంగానో స్థానం లభించింది. యవనులు, శాకాలు మొదట దురాక్రమణదారులుగా వచ్చారు. కొంత కాలం గడిచాక క్షత్రియులలోనే ఒక వర్గం వారికి స్థానం కల్పించబడింది. పశ్చిమాసియా, మధ్య ఆసియా, పర్షియా నుండి వచ్చిన

వారు చాలా బలహీనులు. అందుకని వారు నిమ్న కులుస్తులైనారు. అందుకే యాజ్ఞవల్క్య సంహిత వారిని దొంగలుగాను, బందిపోటుదారులుగానూ వర్ణించటం జరిగింది. వారినుండి ప్రజలను రాజు రక్షిస్తుండేవారు. ఈ విషయమై నాదగ్గర ఎటువంటి సాక్ష్యాధారాలు లేవు. అయితే ప్రస్తుతం మన రాష్ట్రంలో వ్యవసాయంపై ఆధారపడి జీవించే రెడ్డి, కమ్మ, కాపు మొదలగు వారంతా ఒకనాడు బౌద్ధులేనని నా నమ్మిక. బౌద్ధమతం అణగద్రొక్క బడినప్పుడు చాలామంది బౌద్ధులు మహమ్మదీయులుగా మారారు. దాదాపు 1000 సంవత్సరాలపాటు ఆంధ్రులంతా బౌద్ధులే. హిందూ మతం వ్యాప్తి చెందటంతో బౌద్ధ మతం క్షీణించింది. ఆ దశలో బౌద్ధులంతా రెడ్డి, కమ్మ, కాపు మొదలైన కులస్తులుగా మారారు. శూద్రులు కన్నా వారికి కొంత ఎక్కువ స్థానం లభించింది. మొత్తంమీద నేను చెప్పదలచుకున్నదేమిటంటే, హిందూ మతం ఇతరులను తమలో కలుపుకునే క్రమంలో కుల వ్యవస్థ పరిధిలో వారిని బిగించింది.

అసలు నిజానికి కులమంటే ఏమిటి? పుట్టినప్పటినుండి చనిపోయే దాకా జీవితాన్ని నియంత్రించేదే కులం. పుట్టినప్పుడు జరిపే కర్మకాండ కులానికి, కులానికి మారుతుంది. అలాగే విద్యాభ్యాసం చేయించబోయే ముందు జరిపే క్రతువులు కూడా కులానికి, కులానికి మారుతుంటాయి. (శూద్రులు మరికొన్ని అంటరాని కులాల వారికి అసలు విద్యనభ్యసించే అర్హత లేదు. అది వేరే విషయం. అయితే సత్య కామా జాబల మాత్రమే ఇందుకు మినహాయింపు) వివాహ క్రతువుల్లో ఈ తేడా మరింతగా కనబడుతుంది. తమ పెళ్ళిళ్ళు, వేదపఠనాచ్ఛారణతో పురోహితులు జరిపిస్తారని శూద్రుల విశ్వాసం. నిజానికి ఇది వాస్తవం కాదు. వేద సూత్రాల ప్రకారం అగ్నికి ఆరాధన చేరుకుండా వధూవరులు కలసి ఏడడుగులు నడుస్తూ పరస్పరం ప్రేమించకుంటామని, విశ్వాసంతో ఉంటామని ప్రయాణంచేసే సప్తపది వివాహ క్రతువు పూర్తయినట్లు కాదు. అయిన శూద్రుల వివాహాలు జరిపించే సందర్భాలలో బ్రాహ్మణ పురోహితులు ఈ రెండింటిని బుద్ధిపూర్వకంగా మినహాయిస్తారు. శుక్రనీతిసారం శూద్ర వివాహాలలో వేద పఠనాన్నే నిషేధించింది. అదే విధంగా మరణానంతరం జరిపే కర్మకాండ కులానికి కులానికి మారుతుంది. కులాలకు సంబంధించి మరణం కూడా ఒకటి కాదు. వివిధ కులాల వారికి స్మశాన వాటికలు విడి విడిగా ఉండాలని కౌటిల్యుడు చెప్పాడు. ఇప్పుడు

ఆ నియమాలు యథాతథంగా అమలు కాకపోయిన ఆ సందర్భంలో కర్మకాండ చేయించుకునే విధానం, భుజాల మీద, నుదుటి మీద గుర్తులు వేయించుకోవటం, వస్త్రధారణ, భోజనంచేసే విధానం మొదలైన అన్ని విషయాల్లోనూ తేడావుంది. నీవు పుట్టిన సమయంలోనూ, అలాగే నీవు మరణించే సమయంలో మాత్రమే కాక నిద్రలేచే సమయంనుండి నిద్రపోయే సమయం వరకు నీవు ఏమి చేయాలో, ఏమి చేయకూడదో చాలా నిర్దిష్టంగా వున్నాయి. ఇది నిజానికి హాస్యాస్పదంగా వుంటాయి. కొన్ని నియమాలు కర్కశంగానూ, క్రూరంగానూ వుంటాయి. హరిజనుల వంటి నిమ్నకులాల వారు చెప్పులు ధరించకూడదు, గొడుగు వినియోగించకూడదు. కొన్ని సందర్భాలలో వారు చొక్కా కూడా ధరించకూడదు. ఇప్పటికి కేరళలలోని కొన్ని ప్రాంతాలలో నిమ్న జాతి స్త్రీలు జాకెట్లు ధరించటం నిషేధం.

కులానికి సంబంధించి మరొక దుర్మార్గమైన అంశం ఏమిటంటే, విభిన్న కులాల మధ్య సంబంధాలపై నిషేధాలు విధించటం, కులాంతర వివాహాలు జరుగకూడదు. అలాగే ఒకే కులంలోని ఉప కులాల వారి మధ్య కూడా వివాహం నిషేధమే. ఇతర కులస్తులతో బోజనం చేయటం కూడా నిషేధమే. అలాగే హిందు ధర్మ శాస్త్ర ప్రకారం వైశ్యులు లేక శూద్రులు ఒక బ్రాహ్మణుని ఇంటికి అతిధులుగా వచ్చినట్లయితే వారు ఆ బ్రాహ్మణుని జీతగాళ్లతో కలిసి భోజనం చేయాలి. ఒక అగ్రకులానికి చెందిన వ్యక్తి ఒక ఛాండాలుడికి అన్నం పెట్టాలనుకుంటే ఆ అన్నం ఇంటిబైట విసిరి వేయబడుతుంది. ఆ అన్నంకూడా కుక్కలు, ఆవులు మొదలగు జంతువుల కొరకు నిర్దేశింపబడినదై ఉండాలి. ఒక శూద్రుడు పెట్టిన అన్నాన్ని తింటేమరు జన్మలో అతడు పందిగానో, లేక మరో నిమ్న కులానికి చెందిన శూద్రుడిగానే జన్మిస్తాడు. మనం మన ఇండ్లలో భోజనం చేసే సమయంలో పై నియమాల ప్రభావానికి ఇంకా లోనవుతున్నామని నేను భావిస్తున్నాను. ఏది ఏమైనా హిందూ ధర్మ శాస్త్రముల ప్రకారం నీవు బ్రాహ్మణుడివైతే నీ ఇల్లు అగ్రహారంలో వుండాలి; నీవు అంటరానివాడివైతే ఊరికి బయట నివశించాలి. అది కూడా ఊరికి దూరంగా స్మశానాలకు ఆవల ఉండాలని కౌటిల్యుడు స్పష్టం చేశాడు.

అంటరానివాడ్ని కేవలం తాకకుండా ఉండటమే కాదు, భౌతికంగా అతనికి చాలా దూరంగా ఉండాలి. కేరళలో ఒక సాంప్రదాయం ఉంది. "నాయర్ ' కులస్థుడు గనుక అగ్రవర్ణానికి చెందిన వ్యక్తిని తాకితే అతను అపవిత్రుడైపోతాడు. తాపీ పనివారు, కంసాలులు, వడ్రంగులు, తోలు పరిశ్రమలో పనిచేసేవారు, అగ్రవర్ణాల వారికి 24 అడుగులు దూరంలో ఉండాలి. గీత కార్మికులైతే 36 అడుగులు, కొన్ని రకాల వ్యవసాయదారులైతే 28 అడుగులు, గొడ్డు మాంసం తినేవారి విషయంలో అయితే 64 అడుగులు, గ్రామంలో అగ్రవర్ణాలు వారు నివసించే ప్రాంతంలోగూడా ఈ అంటరాని వారు నడవటమే నిషేధం. ఒక బ్రాహ్మణుడు కనబడితే ఆ దారిని వదలి మరొక దారిన వెళ్ళాలి. ఈ శతాబ్ద ప్రారంభంలో ఇటువంటి భయానక పరిస్థితి ఉండేది. ఇప్పటికీ అంటరాని వారు నివశించే ఇండ్లపై దాడులు, దహనకాండ, మానభంగాలు మార్పేమీ లేదని అనిపిస్తుంది. "బెర్నాడ్ షా"కు అత్యంత మిత్రుడు లండన్‌కు చెందిన "టైమ్స్" పత్రిక వ్యాసకర్త అయిన "విలియమ్ ఆర్చర్" మాటల్లో "ప్రపంచం మొత్తం మీద ఒక్క భారతదేశంలోనే కొట్లాది మంది సంఘ బహిష్కృతులు అయ్యారు. అంతేగాక వారు నిమ్నకులంలో పుట్టారనే కారణంపై మతం చేతకూడా వెలివేయబడ్డారు. ఇండియాలో కేవలం బ్రాహ్మణుల మరియు పెరియార్ల గుప్తాధిపత్యం కొనసాగుతోంది." మన స్వరాజ్యం రావటానికి 30 సంవత్సరాల క్రితం 1917లో ఈ వ్యాఖ్యానం చేయబడింది. స్వరాజ్యం వచ్చి ఇప్పటికీ 30 సంవత్సరాలు అయింది (వ్యాసకర్త వ్రాసే సమయానికి). కుల, మత, లింగ వివక్షత లేని రాజ్యాంగం మనకు ఉన్నా నిజానికి మనం ఎక్కడున్నాం

కులం ఒక అంటువ్యాధి లాంటిది. ఈ అంటువ్యాధి ఎంత తీవ్రమైన దంటే కులాలకు స్థానం లేని మతాలలో కూడా ఈ కులమనే అంటువ్యాధి ప్రబలింది. రిప్లే ఇలా అన్నారు. "ఇస్లాం ఒక మతంగా భావించినా లేక ఒక జీవన విధానంగా భావించినా అది పూర్తిగా హిందూ ఇజమ్‌కు విరుద్ధమైనది. ఇస్లాం మనిషికి ఒకే విధమైన జీవితాన్ని ప్రసాదించింది. ఆ జీవితాన్ని ఎలా సార్థకం

చేసుకోవాలో కూడా సూచించింది. పునర్జన్మ గూర్చి కర్మ గూర్చి ఇస్లాంకు తెలియదు. ఇక సామాజిక వ్యవస్థకు వస్తే హిందూ మతంలోని కుల వ్యవస్థను ఇస్లాం వ్యతిరేకిస్తుంది. ఇస్లాం ప్రకారం భగవంతుని దృష్టిలో ఇస్లాం మతస్థులందరూ సమానులే. అయినా ఇండియాలో మహమ్మద్ ప్రవక్త అనుయాయులలో అనేక కులాలు, ఉపకులాలు వున్నాయి. అగ్రవర్ణంగా బ్రాహ్మణులు, నిమ్న స్థానంలో పరియాలు, మధ్యలో మరెన్నో కులాలు వున్నాయి. అయితే వారి పేర్లు హిందువుల పేర్లకు భిన్నంగా వుంటాయి. రిస్లే ఇలా వివరించారు."భారతదేశంలో కులం గాలిలో వుంది. దాని అంటు వ్యాధి లక్షణం మహమ్మదీయులపై కూడా పడింది. దీని పరిణామ పద్ధతి హిందూ క్రమంలోనే జరిగింది. రెండు జాతుల్లో గూడ సామాజిక హోదా కొరకే ప్రాకులాటకన్పిస్తుంది. రెండింటిలోనూ పురోగతి పశ్చిమ దేశాలనుండే వచ్చింది. రెండోసారి జన్మించిన ఆర్యులే హిందువులయితే, అరబ్, పర్షియన్, ఆఫ్ఘన్, మొఘల్ పునాదిగా గల స్వమతస్తులు మహ్మదీయులయినారు.

హిందూ సంప్రదాయంలో వలె అగ్రకులంలోని పురుషులు తక్కువ కులంలోని స్త్రీలను పెండ్లాడేవారు. సయ్యద్ కులస్థుడు షేక్ కూతురును వివాహమాడేవాడు. కాని తనకూతురును షేక్‌కు యిచ్చి వివాహం జరిపేవాడు కాదు. అగ్ర వర్గాలలో కొన్ని అంతర్వివాహాలు మహ్మదీయులలోనూ జరిగాయి. అయితే ఇది కేవలం పేదరికం వత్తిడి వల్లనే జరిగింది. అష్రఫ్ లేదా గొప్ప వర్గానికి చెందిన సభ్యుని కూతుర్ని తక్కువ కులాయిని చెందిన అజ్లఫ్ లేక తక్కువ వర్గానికి చెందిన వానికిచ్చి వివాహం జరుపబడింది. ఇది భారతదేశపు మౌలికతను మార్చడమని బెంగాల్‌లో అంటారు.

ప్రభువు యొక్క దైవభావంగాని, మానవుల యొక్క సోదర భావంగానీ క్రీస్తు మతంలో చెప్పినట్లుగా మరే మతంలోను నొక్కి చెప్పలేదు. అంతేగాక అది దళితుల, నిమ్న జాతుల, తాడిత, పీడితుల మతమయింది. అందువల్లనే అది అధికారానికి, సౌకర్యాలకు, సంపదలకు తప్పకుండ వ్యతిరేకంగా ఉంటుంది. తిరస్కరించబడ్డ కులము గావున అది మానవ అసమానతల పునాదిగా వెలసింది.

గావున దాని ముఖం కుల వ్యవస్థకు వ్యతిరేకంగా వుంటుంది. అయితే ఇండియాలో ఇందుకు భిన్నంగా జరిగింది. ఇందులో జేరిన వాళ్ళలో రెండోసారి జన్మించిన హిందువులు ఒక్క శాతం గూడా లేరు. అయినప్పటికీ దాని కుల వంశానుక్రమం దానికి వుండనే వుంది. రిస్లే అన్నట్టుగా "క్రీస్తు మతము గూడాకులమనే అంటువ్యాధిని తప్పించుకోలేక పోయింది. హిందూ మతం నుండి అధిక సంఖ్యలో మతము మార్చుకునే వారిని పరిశీలించినట్లయితే ఈ ధోరణి భారతదేశం మొత్తం మీద కన్పిస్తుంది. ఒక్కొక్కసారి యిది రెండు వర్గాల మధ్య విభజనగా అనిపిస్తుంది.

బ్రాహ్మణులు కూడా తమనుండి నీరు తీసుకుంటారని కొన్ని పరిశుభ్ర కులాలు, అగ్రవర్గాలు నియంత్రించుకుంటే తక్కువ కులాల వారు న్యూనతా బావంతో ఉన్నారు. పశ్చిమ తీరంలో ఈ కులాలలోని అంతరాలను జీవింప చేయడాకి పోర్చుగీసు మెషనరీలు శ్రద్ధగా గుర్తించారు. దాని ఫలితంగా ఈ పద్ధతి నేటికికొనసాగుతూనే ఉంది.

పోర్చుగీసు వారు ఈ విధానాన్ని ఎందుకు అనుసరించారు? అగ్రకులాలనుండి నియామకాల్ని పొందడానికే గాక వారి సామ్రాజ్యవాద లాభాపేక్షతోనే ఈ విధానాన్ని కొనసాగించారు. కాథలిక్ మతగురువులు కూడా హిందూ కుల వ్యవస్థను ఏ విధంగా ఆచరించారో రిస్లే వివరించారు. కొంకణ్ ప్రాంతంలోని భారతీయ సంతతికి చెందిన రోమన్ కాథలిక్ క్రిస్టియనన్లు బొమ్మన లేక బ్రాహ్మణ, చరోద లేక క్షత్రియ, శూదిల్ లేకశుభ్ర, రెండియార్లు, గౌడలు, మద్వలు, కుంబార, కాఫ్రీస్‌లుగా విభజించబడ్డారు. ఈ వర్గాల మధ్య వివాహాలు పూర్తిగా నిషేధించబడక పోయినా బహు అరుదుగా జరిగేవని చెప్పవచ్చు. కొంకణ్ క్రిస్టియన్లలో బాల్య వివాహాలు నిషేధించబడాయి. అయినా ఆడపిల్లలకు పన్నెండు సంవత్సరాల వయస్సు రాగానే వివాహాల చేసేవారు. కొన్ని సందర్భాలలో బిషప్ యొక్క ప్రత్యేక అనుమతిలో అంతకన్నా చిన్న వయసు వారికి వివాహం చేశారు. వితంతు వివాహాలు నిషేధింపబడక పోయినా ఆచరణలో అవి నిరాకరింపబడనవి. వితంతు మహిళలు మాంసం తినకుండ నిషేధం. వారు కనీసం తమ నోటితో తమ భర్త పేరు

కూడ ఉచ్ఛరించడానికి వీలు లేదు. ఇది పూర్తిగా హిందూ, సాంప్రదాయానికి కొనసాగింపే. వివాహాది క్రతువు క్రిస్టియన్ సాంప్రదాయానుసారం చర్చిలో జరిగేది. అయినా ఆ తరువాత హిందూసాంప్రదాయ బద్ధమైన నిశ్చితార్థం, వివాహం జరుగుతుంది. ఉదాహరణ వధూవరులను స్నానం చేయించడం దివంగతులైన పూర్వీకుల సంస్మరాణార్థం బీదలకు అన్నదానం చేయడం , శిలువ గుర్తు కలిగిన ఒక గొలుసును కొని లేక ఒక తాళిని గాని పెళ్ళి కుమార్తె మెడలో కట్టడం బహుమతులను ఇచ్చి పుచ్చుకోవడం, పెళ్ళికుమార్తెను ఆమె భర్తతో కాపురానికి పంపడం మొదలైనవి.

గత సంవత్సరం చివరలో హైదరాబాదులో జరిగిన ఒక రెడ్డి, క్రిస్టియన్ కుమార్తె యొక్కవివాహానికి నేను హాజరగుట జరిగింది. సుమారు గంట సేపు రోమన్ కాధలిక్ ఆచారులు క్రిస్టియన్ సాంప్రదాయానుసారంగా క్రతువు జరిపారు. ఆ తరువాత హిందూ సాంప్రదాయానుసారంగా తిరిగి మరొక వివాహ క్రతువు జరుపుకొనేందుకు ఆ వధూవరులిద్దరు హిందూ వివాహ మండపానికి చేరుకొన్నారు. నేను గనుక గంట ఆలస్యంగా ఆ వివాహానికి హాజరై ఉంటే అది క్రిస్టియన్ వివాహమని తెలిసేది కాదు.

నిమ్న కులానికి చెందిన ఒక క్రిసిట్టయన్ గనుక అగ్రకులానికి చెందిన క్రిస్టియన్‌గా నటించేందుకు సాహసిస్తే అతనికి మంచి వేషధారణ గూడా లభిస్తుందని అనుకోవటం నాకు తెలుసు. క్రిస్టియన్లలో గల కుల తత్వం గురించి జె.హెచ్. హట్టన్ ఇలా వ్రాశారు. "అగ్రవర్గాలకు ఛెందిన క్రిస్టియన్లు, నిమ్న వర్గాలకి చెందిన క్రిస్టియన్లు విబజించేగోడను బద్దలు కొట్టిన ఒక క్రైస్తవ ఆచారుని విషయంలో మద్రాసు హైకోర్టు కూడా జోక్యం జేసుకోవలసి వచ్చిందని అన్నారు." మలబార్ తీరంలోని సిరియన్ క్రిస్టియన్ల గురించి అయ్యర్ ఇలా వ్రాశారు. "భారతదేశానికి చెందిన ఒక సామాన్య క్రిస్టియన్ కులాన్ని గురించి బాగా పట్టించుకుంటాడు. ఆ క్రమంలో ఒక సాధారణ హిందువు కన్నా అతను భిన్నంగా వ్యవహరించలేడు. మద్రాసు ప్రెసిడెన్సీలోని దక్షిణాది జిల్లాలోగల చాలా మంది క్రిస్టియన్లు కుల వ్యవస్థను హిందువులకన్నా నిష్టగా ఆచరిస్తారు."

భారతీయులలో కొందరు కుల వ్యవస్థను గట్టిగా సమర్ధిస్తారనే విషయం నాకు తెలియక పోలేదు. అలాగే కొందరు విదేశీయులు కుల వ్యవస్థను శ్లాఘించిన విషయం నాకు తెలుసు. ఆక్స్‌ఫర్డ్ విద్యాలయంలో సంస్కృత ప్రొఫెసర్ అయిన మౌనియర్ విలియం భారతదేశం గురించి చాలా పుస్తకాలు వ్రాశారు. అందులో ఒక పుస్తకం పేరు "బ్రాహ్మణులు మరియు హిందూ మతము" ఆ పుస్తకంలో ఆయన ఇలా వ్రాశారు.

"ఆత్మ త్యాగాన్ని పెంపొందింపజేయడానికి కులం ఎంతగానో దోహద పడింది. అదే విధంగా చెడు ప్రవర్తన నుండి దూరంగా ఉండటానికి మనిషి బికారిగా మారకుండా ఉండటానికి ఒక నియమబద్ధమైన వ్యవస్థకు వ్యక్తి తలవొగ్గేలా ఉండేందుకు కులం ఎంతగానో ఉపకరించింది.". యూరపు మరియు ఏషియా అనేపుస్తకాన్ని టేక్‌శాండ్ అనే ఆయన వ్రాశారు. మౌనియర్ విలియం కన్నా మరింత ముందుకు వెళ్ళి ఈ విధంగా వ్రాశారు. "కులమనేది ఒక అద్భుత సృష్టి. ఇది ఒక విధమైన సోషలిజం, అరాచకత్వం నుండి హిందూ సమాజాన్ని కులమే రక్షించింది.". కుల వ్యవస్థను సమ్మతించేవారు నా దృష్టిలో వర్ణవివక్షతను, సామ్రాజ్యావాదాన్ని, నాజీయిజాన్ని సమర్ధించడాన్ని కూడా వెనుకాడరు. విలియం, టౌన్‌శాండ్‌ల భావాలను ఆర్చర్ ఖండిస్తారు. ఆర్చర్‌కు ఇటువంటి ప్రత్యేకమైన అభిమానాలు లేవు. భారత దేశం గురించి భారత దేశంలో నున్న వ్యవస్థల గురించి ఆయనకు ఎంతో విపులంగా తెలుసు. అయితే ఆయన అభ్యుదయ భావాలు గల సంస్కరణ వాదిగా ఆయన ఇలా వ్రాశారు. "కులంతో ఏదైన మంచి ఉన్నదా అని తెలుసుకునేందుకు వ్యక్తిగతంగా నేను పరిశీలన జరిపాను. ఆ కుల వ్యవస్థను సమర్ధించను. కుల వ్యవస్థ సమాజానికి ఏమైనా మేలు చేసిందా? ఏమి చేయలేదని చెప్పవచ్చు. చేతి వృత్తులకు సంబంధించి వంశానుగతమైన నైపుణ్యాన్ని కులం సాధించినదని చెప్పటం జరుగుతున్నది. ఈ వాదాన్ని నేను అంగీకరించడం లేదు. కుల వ్యవస్థ వల్ల భారతదేశానికి జరిగిన నష్టంలతో పోలిస్తే లాభం తక్కువే. సమైక్యతకు బదులుగా కులతత్వం పెరుగుట వలన రాజకీయంగా భారత దేశం

బలహీన పడింది. దేశభక్తికి బదులుగా మతోన్మాదం పెరిగింది. అనారోగ్యకరమైన నిబంధనలతో నిషేధాలతోకూడిన వివాహ వ్యవస్థ భారత దేశాన్ని భౌతికంగా దివాల తీయించింది. అసంబద్ధమైన సామాజిక మతతత్వ భావాలతో భారతదేశం నైతికంగా అవినీతి మయం కావడానికి కులమే కారణం. జీవితానికి ఎంతో అమూల్యమైనవి అనే పేరుతో అసంబద్ధమైన భావాలతో మానసికంగా చచ్చు బడేలాగే చేయటానికి కూడా కులమే కారణం"

కుల తత్వం యొక్క ప్రభావానికి గురియైన మేధస్సు ఎంత తీవ్రమైనదంటే ప్రతిదానిలోనూ కుల వ్యవస్థయొక్క ప్రభావం కనబడుతు అది ఏ స్థాయికి పోయిందంటే తెల్లగా ఉంటే బ్రాహ్మణ బియ్యమని, ఎరుపు రంగులో ఉంటే క్షత్రియుల బియ్యమని, పచ్చగా ఉంటే వైశ్యులదని, నల్లగా ఉంటే శూద్రులదని నమ్మే స్థితికి చేరింది. ఇదే ఆలోచన రంగులకు వర్తిస్తుంది. మణులలోనుండి వజ్రాలను, జంతువులలో నుండి గుర్రాలను తీసుకుని మొదటి నాలుగు పదాలకు ఆపాదించారు. సంగీతానికి రంగేమీ లేదు. అయిన సంగీతానికి ఉండే శృతులను బట్టి సంగీతానికి కూడా కులాన్ని ఆపాదించారు. ఇక పక్షుల విషయానికి వస్తే అంటరాని కాకులు అని మాల కాకులు ఉన్నాయి. కీటకాలలో బ్రాహ్మణ లేక బాపన చీములున్నాయి. మీరు నమ్మినా, నమ్మకపోయినా అత్యంత విషపూరితమైన సర్పాన్ని బ్రాహ్మణ సర్పానికిగా పోల్చినారు. దీన్నంత ఒక పిచ్చి అనుకునే దానికి ఒక విధానమున్నది. కులమనేది ఒక ప్రకృతి నియమమని మీరు సమర్ధవంతంగా ప్రచారం చేయలేకపోతే ప్రజలందరి మీద దానిని రుద్దటం కాని దాదాపు 3,000 సం॥ల పాటు కొనసాగించటంకాని సాధ్యం కాదు. మనువు ప్రకారం ఈ ప్రపంచానికి బ్రాహ్మణుడే యజమాని అతనే సృష్టికర్త. బ్రహ్మణుడు ఏది భుజించినా, ఏది ధరించినా ఏది స్వీకరించినా అది అతని సొంత ఆస్థి అవుతుంది. విష్ణు స్తోత్రముల యొక్క రచయిత దృష్టిలో మనువు ఒక సంస్కరణ వాధ శాసనకర్త. దేవతలు మన కంటికి కనపడని వారయితే , బ్రాహ్మణులు మన కంటికి కనిపించే దేవతలు. ఈ ప్రపంచం బ్రాహ్మణుల వలననే నడపబడుచున్నది. బ్రాహ్మణుల మూలంగానే

దేవతలు స్వర్గంలో నివసిస్తున్నారు. బ్రాహ్మణులు చెప్పింది అది శాపమైనా, లేక వరమైనా ఖచ్చితంగా జరిగి తీరుతుంది. బ్రాహ్మణులు ఇచ్చే వరాలను దేవతలు ఆమోదిస్తారు. మనకంటికి కనిపించే దేవతలైనా బ్రాహ్మణులు అసంతృప్తి చెందితే మనకు కనపడని దేవతలు కూడా అసంతృప్తి చెందినట్లే.

ఎప్పుడైతే నీవు దేవుడనని ప్రకటించుకుంటావో నువ్వు చెప్పినట్లుగా ప్రపంచం నడుచుకుంటుందని ప్రచారం చేయుచూ ధర్మశాస్త్రాల రచయితలు చేసింది ఇదే. ఒక బ్రాహ్మణుడు మూడు మార్లు వివాహము చేసుకొనవచ్చునని యాజ్ఞవల్క్యుడు చెప్పాడు. బ్రాహ్మణుడు శూద్రస్త్రీని వివాహము చేసుకోగూడదు. అయినా తన కులానికే చెందిన తన సొంత భార్య చనిపోయిన పక్షంలో తన వాంఛలు తీర్చుకొనే నిమిత్తం శూద్రస్త్రీని చేరదీయవచ్చు. బహుశా తన పెద్దకుటుంబాన్ని నిర్వహించటం కష్టం గనుక శూద్ర స్త్రీని చేరదీయవచ్చు. బ్రాహ్మణులపై ఎటువంటివి విదించరాదని వశిష్టుడు చెప్పాడు. ఎవరికైనా ఒక నిధి దొరికినట్లయితే అందులో ఆరింట ఐదువంతులు రాజుకు చెందుతుంది, అయితే అదే నిధి బ్రాహ్మణునికి దొరికితే రాజుకు ఏమీ ఇవ్వక్కర్లేదని వశిష్టుడు చెప్పాడు. బౌద్ధ యానప్రకారం క్షత్రియుడు కాని, వైశ్యుడుకాని, శూద్రుడు కాని నిస్సంతువుగా చనిపోతే అతని ఆస్థి రాజుకు చెందుతుంది. అయితే బ్రాహ్మణుడు నిస్సంతువుగా చనిపోతే అతని ఆస్థి బ్రాహ్మణునికే దానమివ్వ బడుతుంది. బ్రాహ్మణుల ఆస్థి ఎవరు ఎత్తుకు పోకుండా చాలా కట్టుదిట్టం చేయబడింది. బ్రాహ్మణుల ఆస్థిని ఎవరైనాఖర్మకాండ కోసమో, తన కుమార్తె వివాహం కోసమో శూద్రుల ఆస్థిని తీసుకోవచ్చు. అందుకోసం అవసరమైతే మోసము చేయవచ్చు. దౌర్జన్యం చేయవచ్చు. అయినా అతని పై ఎటువంటి ఫిర్యాదులు చేయకూడదు. శూద్రునికి ఇంత అన్యాయం జరుగుచున్నా అతను ఏమి చేయగలడు? ఏమి చేయలేడు. ఎందుకంటే ఒక్క బ్రహ్మణుడు మాత్రమే న్యాయమూర్తిగా వ్యవహరిస్తాడు. శూద్రుడు న్యాయమూర్తిగా వ్యవహరించకూడదు. ఒక వేళ శూద్రుడు ఎవరైనా తిరగబడితే అతని నాలుక కోసి వేయబడుతుంది. ఒక కాకిని లేక నెమలిని, ఒక కుక్కను

చంపడం కన్నా ఒక శూద్రుడిని చంపటం పెద్ద నేరమేమీ కాదు.

శూద్రుదుని ఎక్కడ ఉంచాలో అక్కడ ఉంచేందుకు ఈ శాసనాలు తయారు చేయబడ్డవని మీరు భావిస్తే అది పొరపాటే. శతాదిక వృద్ధుడైన ఒక్క క్షత్రియుడు పది సంవత్సరాల బ్రాహ్మణ బాలునితో సమానము. రాజు అందరికీ రాజుగాకాగలడు. కాని బ్రాహ్మణుడికి మాత్రం అతడు రాజు కాడు. బ్రాహ్మణుని సహాకారముతో మాత్రమే రాజు సుఖించగలడు. మరి వైశ్యుల మాట ఏమిటి. మరొకని చెప్పుచేతల్లో అతను జీవిస్తాడు. ఇక శూద్రుని విషయానికొస్తే అతను మరొకరికి సేవకుడు. ఎప్పుడైనా అతనిని బయటకు పంపినా దాచవచ్చు లేదా చంపివేయవచ్చు. ఇక ఛెండాలలు విషయం మరీ దారుణం. అతను మనకు కనుచూపు మేరలో ఉండరాదు. అతనిని చూడుటమే పాపము.

పరిస్థితి ఇంత దారుణంగా ఉన్న ఎవరో కొందరు వ్యక్తులు, చిన్న ముఠాలు తప్ప మరెవరు ప్రతిఘటించలేదు. ఏదోకొద్ది ప్రతిఘటన ఉన్నా అప్పుడప్పుడు మాత్రమే. దీనికి కారణం ఏమిటి? నేనే నా ఈ ఉపన్యాసం చివరల్లో చేసుకున్న కర్మ, పునర్జన్మ వంటి సిద్ధాంతాల ప్రభావం ఇందుకొక బలీయమైన కారణం. ఇక రెండవ కారణం ఏమిటంటే ఒక కులం ఎంత తక్కువ స్థాయికి చెందినదైనా ఆకులంలోని వ్యక్తులు మిగిలిన వారిపై పెత్తనాన్ని, ఆధిపత్యాన్ని కలిగి ఉంటున్నారు. వారు ఈ వ్యవస్థను ప్రతిఘటించలేరు. మరి అసంఖ్యాకంగా ఉన్నా అంటరాని వారి మాటేమిటి. వారిలో కూడా కొందరు మానవ దేవుళ్ళున్నారు. ఈ మానవ దేవుళ్ళు మిగిలిన అంటరాని వారిని దూరంగా ఉంచుతున్నారు. ఓమైలే ఇలా అంటాడు. "ఒక అంటరానివాడు తనకన్నా తక్కువ స్థాయిలో నున్న అంటరాని వాడ్ని తాకితే మైలపడి పోతున్నాడు. "జగ్జీవన్‌రాం అంచనా ప్రకారం అంటరాని వారిలో 563 ఉపకులాలున్నాయి.వారిలో వారికి తరతమ బేధాలున్నాయి. చర్మకారుడి కన్నా వ్యవసాయ కూలీ యొక్క హోదా అధికం, పాకీ వాడికన్నా చర్మకారుడు ఎక్కువ. కులాలు, ఉపకులాలు గురించి మనం ఇలా చెప్పుకోవచ్చు. "జంతువులన్నీ ఒకటైనా

కొన్ని జంతువులు మిగతా వాటికన్నా అధికం".

ఇప్పుడు నేను వాడిన తరతమ బేధాలు అనే పదాన్ని మీరు గుర్తించే ఉంటారు. దీనిని సి.ఆర్.రెడ్డి తిరస్కరించాడు. డాక్టరు అంబేద్కర్ కులాలని గ్రేడింగ్ చేయడం అసమానత్వం అని నిర్వచిస్తే దానిని తరతమ బేధాలతో కూడిన వ్యవస్థ అని రెడ్డి అభివర్ణించాడు. ఈ రెండింటి లోను రెడ్డి యొక్క నిర్వచనం సరైనదని నేను అనుకుంటున్నాను. సమాజాన్ని మనలను గ్రేడింగ్ చేసే క్రమంలో కులం మనల్ని అసమానంగా విబజించింది. ఈ విభజనలో ఉన్నత స్థానంలో ఉన్నవారిని, తక్కువ స్థానంలో ఉన్నవారితో పోలిస్తే మధ్యలో నున్న వారి పరిస్థితి మరీ దారుణం. ఉన్నత వర్గాలలోని దుర్లక్షణాలను అడుగునున్న వారి దుర్లక్షణాలను వీరు అలవర్చుకుంటున్నారు. సమానత్వం మనిషిలోని మంచితనాన్ని బయటకు తెస్తుంది. అసమానత్వం అలాచేయదు.

ప్రాచీన కాలం నుండి నేటి వరకు వందల వేల కొలదీ కులాలు ఉపకులాలను చూసామే తప్ప మనము ఎపుడూ ఒకటిగా లేము. ఇది మన సంస్కృతిని నాశనం చేస్తుంది. వ్యక్తిగతంగాను, సామాజికపరంగాను సంస్కృతి ధ్వంసం అవుతుంది. ఇది ఏవిధంగా ధ్వంసం కాబడుతుందో మరోసారి మీకు వివరిస్తాను.

హుస్సేన్‌సాగర్ తూర్పు వైపున ప్రఖ్యాతి గాంచిన ప్రవక్తలు, కవులు యోధులు, పరిపాలకులు మరియు రాజుల విగ్రహాలుండగా వాటికి ఎదురుగా జీబ్రాలట్రర్ రాక్ మీద 60 అడుగుల బుద్ధ భగవాని విగ్రహం చూపరులకు విశేష ఆకర్షణ. కానీ దాని వెనుక చాలా విషాధ గాధ ఉన్నది.

9 మార్చి 1990న 350 టన్నుల ప్రపంచంలోనే అతిపెద్దదైన ఏక ఖండ బుద్ధభగవానుని విగ్రహం హుస్సేన్ సాగర్ సరస్సులో మునిగి పోయి ఎనిమిది మంది మరణించిన వార్త ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కుదిపేసింది.

ఎబిసి లిమిటెడ్ ప్రాజెక్ట్ మేనేజర్ యస్. కె. ముంద్రా మరియొక అధికారి శ్రీ. దేశ్‌ముఖ్ ఈ దుర్ఘటన జరగక ముందు రవాణానుద్దేశించిన చార్జి మీద ఉన్నట్టు తెల్పింది.

ముఖ్య శిల్పి గణపతి స్థపతి ప్రకారం విగ్రహానికి ఎటువంటి నష్టము జరుగకుండా సరస్సు అడుగునుండి పైకి తీయుట చాలా కష్టతరమైన విషయమని తెలిపారు.

1982లో శ్రీ భవనం వెంకట్రామ్‌గారు ముఖ్యమంత్రిగా ఉన్న సమయమందు నాగార్జునకొండలో బుద్ధభగవానుని విగ్రహం మరియు అభివృద్ధి పరుచుట గురించి పధకము రూపుదిద్దుకున్నది. తరువాత మూడు సంవత్సరములు విగ్రహం చెక్కుటకు కావల్సిన రాతి కోసం వెతుకుట జరిగినది. నల్లగొండ జిల్లా రామగిరి కొండలలోని ఏకఖండ రాయి విగ్రహ నిర్మాణానికి దేవాదాయ పురాతన వస్తు నిపుణులు యస్.యమ్. గణపతితో సహా సరైనదని నిర్ధారించారు. ఈ మధ్య సమయంలో ప్రభుత్వం మారి శ్రీ యన్.టి. రామారావు ముఖ్యమంత్రి

అగుటచే సదరు విగ్రహమును హుస్సేన్ సాగర్ మధ్యలోని జీబ్రాల్టర్ రాక్‌మీద ప్రతిష్టించాలని పాత నిర్ణయాలను రద్దుచేశారు.

1985 అక్టోబర్ 2 వతేదీన ఆనాటి ముఖ్యమంత్రి శ్రీ రామారావు రాయగిరి కొండలను-అధిరోహించి బంగారపు ఉలితో సదరు రాయిని తొలిచే పధకంను ప్రారంభించారు. శ్రీ గణపతి గారి నాయకత్వంలో 200 మంది శిల్పులు 3 సంవత్సరములు పాటు పనిచేసి బుద్ధ భగవానుని విగ్రహమును తయారు చేసిరి. 60 అడుగుల బుద్ధభగవానుని విగ్రహంచెక్కుట ఒక విశేషమైతే దానిని రాయగిరి నుండి 64 కిలో మీటర్లు దూరంలో గల హైదరాబాదుకు రవాణా చేయుట ఇంజనీరింగ్ శాఖకే పెద్ద సవాలైంది. దీని నిమిత్తం పలుసంస్థల నుండి రవాణా చేయుటకు ప్రతిపాదనలు అందినను వాటినన్నింటిని అధిగమించి ఎబిసి లిమిటెడ్ పొందింది.

పశ్చిమ జర్మనీకి చెందిన గోల్డ్ హోఫర్ మరియు **MAN** నుండి సాంకేతిక సహాయముతో 192 టైరులు 24 ఏక్సిల్స్‌గల ట్రైలరతో ఈ భారీ ఏకఖండ విగ్రహాన్ని రవాణా చేయుటకు ఎబిసి సమాయత్తమైంది. దీనికి గాను 440 అశ్వకశక్తిగల రెండు పెద్ద ఇంజన్లు ఈ ట్రైలరకు అమర్చబడినాయి. నవంబర్ 14 1988న విగ్రహాన్ని ట్రైలరమీదకు అమర్చి రవాణా చేయుటకు సిద్ధపరిచిరి.

ఎబిసి వారు రవాణా చేయుటకు నాలుగు రోజులు సమయం పడుతుందని ఊహించగా దానికి భిన్నముగా రెండ్రోజులలోనే అనగా నవంబరు 15, 1988న నగర ప్రవేశం జరిగి స్థానిక ప్రజలను ఆశ్చర్య చకితులను చేసింది. శ్రీ రామారావు

స్వయంగా ఈ విగ్రహాన్ని అందుకొని తదుపరి తుది మెరుగుల నిమిత్తము బుద్ధపూర్ణిమ ప్రాజెక్టు స్థలమునకు చేర్చిరి.

60 అడుగుల భారీ విగ్రహాన్ని ప్రత్యేకంగా తయారు చేయబడిన బార్జిపై జిబ్రాలర్టర్ రాక్‌నకు రవాణా చేయుటకు ప్రారంభించగా కొద్ది నిమిషాలలో ఒడ్డునకు 150 మీటర్ల దూరంలో సదరు బార్జి ఒక పక్కకు ఒరిగి పోవుట చేత 7 మీటర్ల లోతులో విగ్రహము మునిగిపోవుట జరిగినది.

ఈ ప్రమాద సంఘటన జరిగినప్పుడు సదరు బార్జి మీద దాదాపు50 మంది సహాయకులు మరియు యితరులున్నారు. ఎంతమంది నీటిలో మునిగిపోయినది వెంటనే తెలియరాలేదు. తదుపరి అన్ని సహాయక కార్యక్రమముల పిదప 8 మంది మునిగి పోయినట్లు గా నిర్ధారించారు.

అప్పటి ముఖ్యమంత్రి డా॥ మర్రి చెన్నారెడ్డి ఈ వార్త తెలియగానే తన బెంగూళూరు పర్యటనను అర్ధవంతంగా రద్దు చేసుకొని హైదరాబాదుకు తిరిగివచ్చి ప్రమాద సంఘటన జరిగిన ప్రదేశము చేరుకొని ప్రమాద కారణాలు కనుగొనుటకు న్యావ విచారణకు ఆదేశించారు.

ఈ విషయంలో డా॥ చెన్నారెడ్డి విషాదకరసంఘటనకు ఎంతమంది ఖచ్చితంగా బలయింది చెప్పలేమని అన్నారు. రాష్ట్రప్రభుత్వం తూర్పు నావికా కమాండ్ నుండి డీప్‌సీడ్రైవర్లును కోరిందని వారు వచ్చి సదస్సు అడుగు భాగము వెతికితే గాని వాస్తవ పరిస్థితి తెలియదన్నారు.

ఆనాటి ముఖ్యమంత్రి తాను ఈ బుద్ధ భగవానుని ప్రతిమను ప్రఖ్యాత బౌద్ధరామమైన నాగార్జున సాగర్‌లో ప్రతిష్టించడానికితానుసుముఖుడని, కాని

అప్పటికే రు. 5.58 కోట్లు ఖర్చుచేయుట జరిగినది గావున ఆ సందర్భంలోమార్పు జరగాలని కోరబోనన్నారు.

బుద్ధపూర్ణిమ ప్రాజెక్టును సందర్శించిన ముఖ్యులలో మాజీ ముఖ్యమంత్రి శ్రీ రామారావు, ఆయన పరిపాలనాకాలంలో ఈ ప్రాజెక్టు ప్రారంభించబడి దాదాపు పూర్తి కావచ్చినది. ఆయన విగ్రహం మునిగిపోయిన ప్రాంతాన్ని సందర్శించి ఈ విషయంలో ప్రభుత్వం తనతో కనీసం సంప్రదించలేదని ఆవేదన వ్యక్త పర్చారు.

ప్రత్యక్ష సాక్ష్యుల కథనం ప్రకారం మునిగిపోయిన బార్జిమీద దాదాపు 50 మంది వ్యక్తులుండి 9.3.1990 సా॥ 5.30 లకు తన ప్రయాణాన్ని ప్రారంభించిందని తెలిపారు. రవాణా మరియు ప్రతిష్టాపన నిమిత్తం కాంట్రాక్టు పొందిన ఎబిసి లిమిటెడ్ వారు బార్జి మీద ఇనుప పుల్లీలు, ఇనుప మోకులనుపయోగించి విగ్రహాన్ని బార్జిమీదకు చేర్చారు. కాని వెనుక భాగమునకుబురద అడ్డుకొనుట వల్ల అది ముందుకుసక్రమంగా ప్రయాణించ లేకపోయింది.

ఆనాటి ముఖ్యమంత్రి డా॥ యం. చెన్నారెడ్డి ది. 8.3.90న విగ్రహంతయారు పూర్తి చేయబడిన తర్వాత దానిని జిబ్రాల్టర్ రాక్‌కు రవాణా చేయు నిమిత్తం చార్జిపై అమర్చబడిన పనికి ప్రారంభించారు. వాస్తవంగా అది శనివారం సాయంత్రంనకు జిబ్రాల్టర్ రాక్‌కు చేరుకొని మే 9 లోగా మిగతా పనులను పూర్తిగావించుకొని బుద్ధపూర్ణిమ సందర్భంగా సదరు విగ్రహం ఆవిష్కరించాలని నిర్ణయించారు.

దీని మొత్తం ప్రాజెక్టు ఖర్చు రు. 5.58 కోట్లుగా అంచనా వేయబడినది. అయినా జనార్ధనరెడ్డి ప్రభుత్వం మునిగిపోయిన బుద్ధ విగ్రహాన్ని బయటకు తీసి జీబ్రాల్టర్ రాక్ పైన అందంగా నిర్మాణం గావించబడిన వేదికపై ప్రతిష్టించారు దీని 18-10-94న ఆనాటి ప్రధాని మంత్రి శ్రీపి.వి. నరసింహారావు గారిచే ప్రారంభోత్సవం చేయించాలని నిశ్చయించారు. దీనిని సఫలీకృతం చేయుటకు విజయభాస్కరరెడ్డి గారి ప్రభుత్వం చాలా కృషిచేసినారు.

మన దేశములోగల మిగతా బుద్ధ భగవానుని విగ్రహముతో పోల్చితే హైదరాబాదులో ప్రతిష్టింపబడిన విగ్రహము వాటితో సమానముగాలేదని చూపరులు ఆందోళన చెందుట జరిగింది.

ది 1994 అక్టోబరు 6వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కరరెడ్డి గారుబుద్ధపూర్ణిమ ప్రాజెక్టులోని నెక్లెస్ రోడ్‌కు ప్రారంభోత్సం గావించారు. ఇది 1978 సం॥రంలో డా॥ చెన్నారెడ్డిగారు ముఖ్యమంత్రి, శ్రీమతి రోడా మిస్త్రీ గారు పర్యాటక శాఖ మంత్రిగా వున్నప్పుడు ఈ పథకము రూపుదిద్దుకొన్నది. అయితే శ్రీ కె.విజయభాస్కరరెడ్డిగారు ముఖ్యమంత్రిగా పదవీ బాధ్యతలు చేపట్టిన అనంతరం దీర్ఘకాలంగా జాప్యం జరుగుతున్న ఈ ప్రాజెక్టు పై ప్రత్యేక శ్రద్ధ వహించి నిర్మాణము పూర్తిగావించుటకు గట్టిగా కృషిచేసారు.

ఈ ప్రాజెక్టు అసలుసృష్టికర్త బాంబేకి చెందిన చార్లెస్ కొరియా. బుద్ధపూర్ణిమ ప్రాజెక్టు మొత్తము చాలా విధములుగా విభజించబడినది. అవి బుద్ధుని విగ్రహం, నగరవాసులు మరియు పర్యాటకుల కొరకు అందమైన ఉద్యాన వనం, 18 నెలల కాలములోరు. 27.00 కోట్లు ఖర్చుతో ఖైరతాబాదు పై ఓవరు నుండి సంజీవయ్య పార్కునకు వృత్తాకారములో హుస్సేన్ సాగర్‌చుట్టూ

నిర్మాణము గావింపబడుచున్న రోడ్డు పనులు చాలా సత్వరముగా నిర్వహించబడుచున్నవి. 40 మీటర్లు వెడల్పు 3.5 కిమీల నిడివిగల ఈ రోడ్డు రు. 913.00 కోట్ల మెగాసిటీ ప్లానులోనిదే; ఈరోడ్డు నిర్మాణములో కాలువలమీద నాలుగుచోట్ల వంతెనలు, పాటిగడ్డ వద్ద విమానాశ్రయ రోడ్డును కలపుతూ పై ఓవరు నిర్మాణం వుంటాయి. ఈపనిని నిర్వహించుటకు కాంట్రాక్టు పొందిన నాగార్జున కనస్ట్రక్షన్స్ ప్రత్యేకముగా పూడికను తీయుటకు ఘనపు మీటరుకు 50 రూ/ల చొప్పున "క్యాలింగ్ కాట్ 300" అనే డ్రెడ్జర్‌ను తీసుకువచ్చి 6 లక్షల ఘనపు మీటర్ల పూడిక తీసి ఈ రోడ్డు నిర్మాణం గావించిరి.

మింట్ కాంపౌండుకు దగ్గరలో 58 ఎకరాల ఖాళీ స్థలములో డిస్నీలాండ్ తరహా వినోద పర్యాటక కేంద్రం, డంకన్ మెక్నీల్ కంపెనీ , బ్రిటన్ వారిచె రెండుపలు అంతస్తుల అంతర్జాతీయ వ్యాపార కేంద్రం నిర్మాణం గావించాలని తలపెట్టి దానికి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కరరెడ్డి గారు శంకుస్థాపన జరిపారు. బుద్ధ విగ్రహము ప్రతిష్టింపబడిన తర్వాత బోట్ల రద్దీని తట్టుకొనుటకుగాను రు 1.1 కోట్ల ఖర్చులతోప్రత్యేకమైన సిమెంటును ఉపయోగించి 140 మీటర్లు పొడవు గల జెట్టిని నిర్మించారు. దీనిలో ఒకేసారి 40 బోట్లనునిలుపుకొనవచ్చును

ఇప్పుడు బుద్ధ విగ్రహము తయారు చేయుటకు ఉపయోగించిన రాయిని గురించి చెప్పుకుందాం. దక్కన్ పీఠభూమిలో ముఖ్యంగా హైదరాబాదు కాకతీయులు పాలించిన ప్రాంతాల్లో నిర్మాణంగావించిన దేవాలయములో మరియు విగ్రహములలో ముఖ్యముగా ఎక్కువగా బ్లాక్ గ్రానైట్ లేక బాసాల్ట్ అనేరాయిని ఉపయోగించారు. హనుమకొండ, వరంగల్, పాలంపేట, కొలనుపాక

## భారతీయ సంస్కృతిలో కుల ప్రభావం

నిర్మాణముగ నిర్మింపబడిన దేవాలయములు విగ్రహములు కాకతీయ ప్రాంతంలో విస్తృతంగా దొరికే బ్లాక్ బాసాల్ట్ అనే రాయిని ఉపయోగించి నిర్మించినవే. కాని ఆశ్చర్యకరమేమిటంటే బుద్ధ భగవానుని విగ్రహము నిర్మించుటకు భోనగిర్ దగ్గరలో గల రాయగిరి కొండలలో నుండి గ్రే స్టోన్ నుండి తయారు చేయటమే. గోలి మరియు నాగార్జునకొండలలోని బుద్ధభగవానుని విగ్రహములు మలచిన వైట్ శాండ్ స్టోన్‌కు సరిసమానముగా వున్నది.

హుస్సేన్ సాగర్‌ను పర్యాటక కేంద్రంగా మలచటం ఒక గొప్ప విశేషమైన విషయం. ఎందుచేతనంటే ప్రపంచంలోని బుద్దిస్టులు ఒకసారి హైదరాబాదు వచ్చి హుస్సేన్‌సాగర్ మధ్యనగల బుద్ధభగవానుని విగ్రహము దర్శనము కొరకు ఉవ్విళూరుతున్నారు.